

### మజిలీలో మరో మలుపు

'బొమ్మ' మీద మొగ్గ 'బన్ను' మనసు
బరువుగా సాగెనా మూస చదువు.

తనుకోరె విద్యకో 'రంగు' మలుపు
పంపించె తన తండ్రి 'మందు' బడికి.

మార్చె దృక్పథంబు మాధవయ్య
లాగె మనసు 'ఆర్ట్' స్కూలు చేర.

ఫేటు 'రంగు' బాట తీర్చి దిద్ద
వీడె ఓరుగల్లు 'బన్ను' నాడు.

చేరె భాగ్యనగరు ' సూరి' తోడ
నేర్చె విద్యలెన్నొ 'ఆర్ట్' కాక.

రాణించ 'రోహిణి' లైఫ్ లోన
తీర్చిదిద్దుకొనియె బ్రతుకుతెరువు.

కుంటుపడగ 'ఆర్ట్' ఏజెన్సీ మాటు
మూసె 'కేన్వాసు' న్యూసుపేపరాడ్.

జవదాటినందుకో తండ్రి మాట
విధిగ సేవింపదలచె 'మందు' మితిగా.

నాడు వీడిన ఆయుర్వేదం
నేడాయె మనవాడి విస్సన్నవేదం.

ఎండమావులకు సడలని వాడు
పొట్టివాడు గాని 'గట్టి' కానివాడు.

మెత్తవాడని తలచి మొట్టి చూడు
బొప్పికట్టగ తిరిగి బుఱ్ఱ నీది.

ఫెయిర్ మైండ్ వాడు ప్రిన్సిపుల్డ్
బరిదాటక పోకు నీదరికిచేరు.

తల 'బట్ట' కట్టినా తెరలేదు 'తలపుకు'
తీర్చిదిద్దకపోడు తిరిగి 'కేన్వాసు'.

భార్య భాగ్యలక్ష్మి తోడునీడ
నింపు నూరేళ్ళు నీ రంగు కళను.

షష్టిపూర్తి జరుప సంతానద్వయము
'పటేల్' వాడు మరియు 'పండు' పొన్ను
హితుల కోర్కె మేర కూర్చె 'బులుసు'.
- 25 నవంబర్ 2007

నా బాల్యనేస్తం 'ఆర్టిస్ట్' యర్రమిల్లి రోహిణీ కుమార్ అనూహ్య 'రాక్ పెయింటింగ్స్' ఆర్ట్ వరల్డ్ ని 'రాక్' చేశాయనడం అతిశయోక్తికాదు. తనకు నా పుస్తకాలకు అపురూప కవర్ డిజైన్లు రూపొందించి నందుకు రచయిత గా నేను ఋణాత్ముడ్ని.